శ్రీ రాజా గోడే నారాయణ

గజపతి రాయనిగారు [illegible]వారి

మహాలలో జరిపించిన సంకీర్తనల

నంతరం చేసిన కృషి వ్యాసము

1820
8343

వేదాంతము

ఓం

దుర్ముఖిసంవత్సరాదిని శ్రీరాజా గోడేనారాయణ గజపతిరాయనింగారుC.I.E.వారి మహాలులో జరిగించిన సంకీర్తనానంతరమందు చేసినయుపన్యాసము-

---

యత్కీర్తనం యత్స్మరణం యదీక్షణం
యద్వందనంయచ్ఛ్రవణం యదర్హణమ్।
లోకస్య సద్యో విధునోతికల్మషం
తస్మైసుభద్రశ్రవసే నమోనమః॥

యత్కీర్తనమ్= ఎవ్వనికీర్తనంబును, యత్స్మరణమ్= ఎవ్వనిస్మరణంబును, యదీక్షణమ్=ఎవ్వనిజూచుటయును,యద్వందనమ్ = ఎవ్వని నమస్కరించుటయును, యచ్ఛ్రవణమ్=ఎవ్వనివినుటయును, యదర్హణమ్=ఎవ్వనిపూజయు, సద్యః= అప్పుడే,లోకస్య= లోకముయొక్క, కిల్బిషమ్= పాపమును,వి

ధునోతి= పోఁగొట్టుచున్నదో, సుభదళిశ్రీ
వసే తస్మై=మంగళకరంబగువిధికిగల వా
నికొఱకు, నమః=నమస్కారము- నమః=
నమస్కారము-

౧ ఇదివరలో ముఖ్యముగా మత
ములలో వ్రాయబడ్డ ఉపదేశములను గుఱిం
చి చెప్పియున్నాము గదా. ఇప్పుడు మ
తప్రరోహములనున్ను హిందూమతముయొ
క్క వివరణమునున్ను కొంచెముప్రస్తావిం
చుదము.

వైదికమతావళిలో చెప్పినది

"మతములనఁగా అభిప్రాయముల
ట- ఈ శబ్దము, మన్, తలంచు అనుధాతు
వుపై బుట్టినది. ఈ మతశబ్దము ఆముష్మిక
మును గుఱించిన సిద్ధాంతములయందు వ్యవ
హరింపబడుచున్నది. ఆముష్మికమనగా పర
లోక సంబంధి యయినది"

౨ ఈపృథివియొక్క పురాతనచరిత్రములవల్ల అనేకమతములు ప్రసరించియున్నవి- వాటిలో కొన్నితర్వాత ఉత్పన్నములయినప్పటికిని అవిప్రవర్తించియుండిన దేశములు అన్యమతములవల్ల ఇప్పుడు ఆక్రాంతములయి యున్నవి- ఈభరతఖండములో అనేకమతములు వ్యాపించినప్పటికిని ఒకప్పుడు బౌద్ధమతమువల్ల దేశముచాలామట్టుకు ఆక్రాంతమైయుండి నప్పటికిని ఆదిమతమైన హిందూమతము స్థాపింపఁబడియున్నదిగాని కొదువదేశములయంతలి మతములవలె ఈమతము నశించి ఈదేశము అన్యమతావేష్టితము కాలేదు-

3 హిందువులు,తమముఖ్యమతగ్రంథముఅనఁగా వేదములు భగవంతునివల్ల శ్రుతములుగా చెప్పబడ్డవిగనుక, అదే ఆదిమతమని చెప్పుచున్నారు- హిందూమతములో

ఒకవ్యక్తిని అనుసరించి మతాచారము భగ
వంతుఁడు చెప్పినాఁడని లేదు- ఆదిని భగ
వంతుఁడే శ్రుతిపూర్వకముగా తనసంగతి
న్ని లోకోపకార సంగతిన్ని ఆత్మనిత్యత్వము
మొదలయినవాటినిన్ని ప్రసాదించినట్టు చె
ప్పఁబడియున్నది

తిరిగి వైదికమతావళిలో చెప్పబడ్డది
ఏమంటే

,,వేదముబ్రహ్మకాండమనియునుక
ర్మకాండమనియును రెండు భాగములు- క
ర్మకాండమున ముఖ్యముగా పరమేశ్వరా
రాధనరూపములయిన యజ్ఞాది క్రతువు
లు చెప్పఁబడినవి- బ్రహ్మకాండమున జీవే
శ్వరతత్త్వము చెప్పఁబడినది- వీనిలో కర్మ
కాండము మొదట నావిర్భవించినది- త
ర్వాత బ్రహ్మకాండమైన ఉపనిషత్తులు ఆవి
ర్భవించినవి- ఉపనిషచ్ఛబ్దమునకు అస్యాం

శ్రేయః ఉపనిషీదతి అని విగ్రహవాక్యము- దీనియందు మేలు ఉన్నది అనిదానియర్థ ము- అనఁగా మనకు హితమును తెలియఁజే యునది ఉపనిషత్తనుట- ఉపనిషచ్ఛబ్దమున కు రహస్యమనియు నొకటియర్థము క లదు"

ఈయుపనిషత్తులలోనే బ్రహ్మతత్వ ము, బ్రహ్మోపాసనము, చెప్పఁబడి ఇ వి హిందూవేదాంత గ్రంథములకు ఆకర మైయున్నవి- వీటిని గూర్చియే వేదవ్యాసుల వారు సూత్రములను జేసియున్నారు-

మఱియును కర్మకాండములో చే ప్పిన యజ్ఞకృత్యములకు అగ్ని, ఇంద్రు డు, రవి, ముఖ్యులయిన యజ్ఞదేవతలుగా పర్వలుపబడి వీరికొఱకే యజ్ఞాది క్రి తువులు చేయవలసినదిగా జెప్పబడి వా యువు వరుణుడు మొదలయిన ఇతరదే

వతల పేరులతోగూడ పేరికే యజ్ఞకృత్యములు చేయబడుచు, ఒకొక్కకట పేరుగల దేవత నిమిత్తము క్రతువు చేయునప్పుడు ఆ దేవతయె సర్వేశ్వరుడుగా నారాధన చేయబడుచుండడమే కాకుండా మఱియు ను తమ తమ ఈప్సితార్థము అనేక దేవతలనుగుఱించి మంత్రయుక్తములయిన స్తోత్రములు ఏర్పడినవి.

ఇంకను ఉపనిషత్తులలో ,,నిర్వికల్పోనిరఞ్జనోనిరాఖ్యాత శ్శుద్ధో దేవ ఏకో నారాయణః॥ అని చెప్పఁబడినవాని యొక్క ఆరాధన హిందూమతమునకు ముఖ్యమైన వృటికిని ఆయననే ఉద్దేశించి సృష్టిస్థితి లయహేతువులనుబట్టి ఉపాసనాకార్యార్థము ఆయనకు రూపకల్పన చేయబడ్డదని చెప్పఁబడియున్నది.

జమదగ్నిస్మృతిలో

ఉపాసకానాంకార్యార్థం
బ్రహ్మణో రూపకల్పనా ।

అనఁగా బ్రహ్మ సృజించుటకున్ను విష్ణువు పాలనకున్ను మహేశ్వరుఁడు లయమునకున్ను అనియేర్పర్చబడియుండడమే కాకుండా వీరుతమతమకార్యములకు తోడయ్యేవారిని, అనగా సరస్వతి విద్యకున్ను లక్ష్మి శోభకున్ను కరుణకున్ను పార్వతి సమస్తశక్తులకున్ను, భార్యలుగా చేర్చుకున్నట్లు ఉన్నది. ఇంతేకాకుండా ఆదిశక్తి స్వరూపిణియై భగవతి అంతకు కారణభూతురాలని కూడా చెప్పబడియున్నది.

ఈ దేవతలు పూర్వము కర్మకాండములో ఇంద్రుడు అగ్ని రవి వీరిని గురించిచెప్పిన ప్రకారము ఒక్కొక దేవతను అర్చనచేసినప్పుడు ఆదేవతయే సర్వశక్తిగల భగవంతుడని చెప్పబడినట్లున్నది.

ఇంతేకాకుండా భగవంతుఁడు అ
నేకావతారములుఎత్తి లోకసంరక్షణము
చేసినాడని చెప్పబడ్డది-

భగవద్గీతలు ౪అ॥ శ్లో౮॥

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయచ దుష్కృతామ్ ।
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగేయుగే ॥

సాధూనామ్= సత్పురుషులయొక్క, పరి త్రాణాయ= రక్షణకొఱకున్ను, దుష్కృతామ్= పాపకర్మములుచేయువారి, వినాశాయచ= నాశముకొఱకున్ను, ధర్మసంస్థాపనార్థాయ = ధర్మములనులెస్సగా స్థాపించుటకొఱకును, యుగేయుగే= ప్రతియుగమందును, సంభవామి= పుట్టుచుందును -

అవతారపురుషులేమి ఋషులేమిఅ

నేకాద్భుత కార్యములు చేసియున్నట్లు చె
ప్పడమే కాకుండా హిందూమతములో అ
నేకశాఖలు ఏర్పడి తమతమ ఉపాసనల
కొలది అనేకపూజలు చేయబడుచున్నవి-
మఱిన్ని ప్రతిగొప్పవస్తువున్ను కా
లమున్ను భగవంతునిస్వరూపముగా నేహిం
దువులు తమ గ్రంథములనుబట్టి తలంచు
దురు.

భగవద్గీతలు అ౧౦॥ శ్లో-౨౬॥

అశ్వత్థస్సర్వ వృక్షాణాం
దేవర్షీణాంచ నారదః।
గన్ధర్వాణాం చిత్రరథ
స్సిద్ధానాం కపిలోమునిః॥

సర్వవృక్షాణామ్=అన్నిచెట్లలో, అశ్వత్థః=
రావిచెట్టును, అస్మి-అగుచున్నాను- దేవర్షీ
ణామ్=దేవఋషులలో, నారదశ్చ= నా
రదుడనును, అస్మి= అగుచున్నాను- గంధ

ర్వాణామ్=గంధర్వులలో, చిత్రరథః=చిత్ర రథుఁడను, అస్మి= అగుచున్నాను-సిద్ధానా మ్= సిద్ధులలో, కపిలః మునిః= కపిలుఁడ నెడి మునిని, అస్మి= అగుచున్నాను-

భగవద్గీ ॥ అ౧౦॥ శ్లో౩౫॥

మాసానాం మార్గశీర్షోఽహం
ఋతూనాం కుసుమాకరః॥

మాసానామ్= మాసములలో, మార్గశీర్షః= మార్గశీర్షము, అహమ్= నేను- ఋతూనామ్= ఋతువులలో, కుసుమాకరః= వసంతము, అహమ్= నేను-

ఈచెప్పున హిందూమతములో వారి వారి మనోభిప్రాయములనుబట్టి అనేక శాఖోపాసనలుకూడ ఏర్పడియున్నవి-

హిందూమతములో భగవంతుని ఆరాధనయున్న పరోపకారమున్న ఇంద్రి తో చేరిన దేశమయున్న మంచినడతయు

న్ని చెప్పబడడమే కాకుండా ఆత్మనిత్యమని
న్ని శరీరమనిత్యమనిన్ని శరీరనాశమును గూర్చి
భయపడవద్దనిన్ని జన్మాంతరము లున్నవని
న్ని పైలోకములున్నవనిన్ని భగవంతుని
యందే భారముంచవలసినదనిన్ని మోక్ష
స్థానమున్నదనిన్ని చెప్పబడియున్నది.

ఆత్మనిత్యత్వమును గూర్చి
భగవ॥అ౨॥శ్లో॥ ౩౦॥

దేహీనిత్యమవధ్యోఽయం
దేహే సర్వస్య భారత।
తస్మాత్సర్వాణి భూతాని
నత్వం శోచితు మర్హసి॥

హే భారత= ఓ భరతవంశ్యుఁడా, సర్వస్య= సమస్తమైన ప్రాణి జాతమునకును, దేహే= దేహము, వధ్యమానేఽపి= చెడఁగొట్టఁబడుచున్నను, అయం దేహీ= ఈశరీరముకలవాఁడగు నాత్మ, నిత్యమ్= నిత్య

ముగా, అవధ్యః= చెడఁగొట్టఁబడఁదగిన వాఁడు కాఁడు. తస్మాత్ = అందువలన, త్వమ్= నీవు, సర్వాణి భూతాని= అన్ని భూతములనుగూర్చి, శోచితుమ్= దుఃఖించుటకై, నార్హసి= తగవు.

శరీరానిత్యత్వమునుగూర్చి

భగవ॥అ౨॥శ్లో౧౮॥

అన్తవన్త ఇమే దేహా
నిత్యస్యోక్తా శ్శరీరిణః।
అనాశినోప్రమేయస్య
తస్మాద్యుధ్యస్వ భారత॥

నిత్యస్య= నిత్యుఁడును, అప్రమేయస్య= తెలుసుకోవడమునకు అతీతుఁడైన వాఁడును, అనాశినః= నాశములేని వాఁడునగు, శరీరిణః= ఆత్మయొక్క, ఇమే దేహాః= ఈదేహములు, అన్తవన్తః= నాశముగలవిగ, ఉక్తాః= చెప్పబడ్డవి.

శరీరనాశమును గూర్చి భయపడవద్దని

భగవ॥అ౨॥శ్లో ౧౩॥
దేహినోఽస్మిన్ యథా దేహే
కౌమారం యౌవనం జరా ।
తథా దేహాన్తరప్రాప్తి
ర్ధీరస్తత్ర నముహ్యతి ॥

దేహినః = ఆత్మకు, అస్మిన్ దేహే = ఈ దేహమున, కౌమారమ్ - బాల్యంబును, యౌవనమ్ - యౌవనంబును, జరా - ముదిమియును, యథా =ఎట్లు, భవన్తి = కలుగుచున్నవో, తథా = అట్లె, దేహాన్తరప్రాప్తిః - మఱియొక శరీరమును బొందుటయును, భవతి = కలుగుచున్నది- తత్ర = ఆవిషయమున, ధీరః = బుద్ధిమంతుఁడు, నముహ్యతి - మోహముఁ జెందఁడు-

పైజన్మములను గూర్చి-
భగవ॥అ౪॥శ్లో ౫॥
బహూని మే వ్యతీతాని
జన్మాని తవచార్జున!

తాన్యహం వేద సర్వాణి
న త్వం వేత్థ పరంతప ॥

హే అర్జున = ఓయర్జునుఁడా, మే - నాకును, తవచ = నీకును, బహూని = అనేకములయిన, జన్మాని = జన్మములు, వ్యతీతాని = అతిక్రమించినవి - తాని సర్వాణి - వాని నన్నిటిని, అహమ్ - నేను, వేద = ఎఱుంగుదును, త్వమ్ = నీవు, న వేత్థ - ఎఱుంగవు -

ఈచొప్పున జన్మములు ఉన్నవన్న నమ్మకము ఏమికలుగఁ జేయుచున్నది?- పైజన్మమందు తనకు మేలుకలిగేకొఱకు వర్తమానజన్మములో యుక్త ప్రవర్తనగా నడవడమే కాకుండా తన నడువడినిగుఱించి పరజన్మములో దిద్దుకొనుటకు అవకాశము కలిగియుంటుంది-

భగవంతుని సేవించినవాఁడు ఆతనిని

పొందుచున్నాఁడని యున్నదిగదా-

భగవద్గీ॥ అ ౭ ॥శ్లో ౨౩ ॥

దేవాన్ దేవయజో యాన్తి
మద్భక్తా యాన్తి మామపి ।

దేవయజః - దేవతలను గూర్చి యాగములు చేయువారు, దేవాన్ = దేవతలను, యాన్తి - పొందుచున్నారు. మద్భక్తాఅపి = నా భక్తులును, మామ్ = నన్ను, యాన్తి = పొందుచున్నారు -

కర్మమునుగూర్చి-

భగవ॥ అ ౨ ॥శ్లో ౪౮॥

యోగస్థః కురుకర్మాణి
సంగం త్యక్త్వా ధనంజయ ।
సిద్ధ్యసిద్ధ్యోస్సమో భూత్వా
సమత్వం యోగ ఉచ్యతే ॥

హేధనంజయ- ఓయర్జునుఁడా, సంగమ్ = సంగమును, త్యక్త్వా- విడిచి, సిద్ధ్యసి ద్ధ్యోః = ఫలము సిద్ధించుటయందును సిద్ధిం

పకపోవుటయందును , సమః = సమానుఁ
డవు , భూత్వా = అయి, యోగస్థస్స
న్ = యోగమందున్నవాఁడవై , కర్మా
ణి = కర్మములను , కురు = చేయుము -
సమత్వమ్ = సమానముగా నుండుటయే ,
యోగః = యోగము , ఇతి = అని , ఉ
చ్యతే = చెప్పఁబడును -

పైలోకమునుగూర్చియూ నీతివర్ణన
మునుగూర్చియూ

భారతము- ఆనుశాసనికపర్వము -
అ౧౪౩॥ శ్లో౨౪॥

యే వర్జయన్తి పరుషం
పరద్రోహంచ మానవాః ।
సర్వ భూత సమా దాన్తాః
తేనరా స్స్వర్గగామినః ॥

యేమానవాః = ఏమనుష్యులు,పరుషమ్ =
పరుషమైన వచనమును, పరద్రోహంచ =
పరులవిషయమయిన ద్రోహమునున్ను, వ

ర్జయంతి = విడిచిపెట్టుచున్నారో, సర్వ
భూతసమాః = సమస్త ప్రాణులయందు
సములును, దాన్తాః = దమముగలవారున
గు, తేనరాః = ఆనరులు, స్వర్గగామి
నః = స్వర్గమునుపొందెడివారు, భవన్తి =
అగుచున్నారు-

భారతము అను॥ అ౧౪౩॥ శ్లో ౨౬॥

అరణ్యే విజనే న్యస్తం
పరస్వందృశ్యతే యదా।
మనసాపి నహింసన్తి
తేనరాస్స్వర్గగామినః॥

విజనే = జనశూన్యమగు, అరణ్యే = అడవి
యందు, న్యస్తమ్ = ఉంచఁబడిన, పరస్వ
మ్ = పరధనమును, యదా = ఎప్పుడు, మ
నసాపి = మనస్సుచేతనున్ను, నహింసన్తి =
హింసింపరో, అనఁగా హరింపనిచ్ఛయించ
రో, తే నరాః = ఆనరులు, స్వర్గగామి

నః= స్వర్గమును పొందెడివారు, భవన్తి= అగుచున్నారు-

భా॥అను॥ అ౧౪౩॥శ్లో॥౩౮॥

తథైవ పరదారాన్యే
కామవృత్తాన్ రహోగతాన్।
మనసాఽపి నహింసన్తి
తేనరా స్స్వర్గ గామినః॥

తథైవ=అలాగుననే, కామవృత్తాన్=మన్మథవ్యాపారము కలిగినట్టియు, రహోగతాన్=ఏకాంతస్థలమును పొందినట్టియు, పరదారాన్=పరస్త్రీలను యే= ఎవ్వరు, మనసాఽపి= మనస్సుచేతనున్ను, నహింసన్తి= హింసింపరో, అనఁగా కామించరో, తేనరాః = ఆనరులు, స్వర్గగామినః = స్వర్గమును పొందేవారు, భవన్తి= అగుచున్నారు-

పరోపకారమునుగూర్చి

భారతము ॥ అను॥ అ ౬౩ ॥ శ్లో ౬॥

అన్నేన సదృశం దానం
నభూతం నభవిష్యతి ।
తస్మాదన్నం విశేషేణ
దాతుమిచ్ఛన్తి మానవాః ॥

అన్నేన = అన్నదానముతో , సదృశమ్ = సమానమైన , దానమ్ = దానము , భూతమ్ - అయినదియు , న - లేదు-న భవిష్యతి = కాంబోదు. తస్మాత్ = అందువలన, మానవాః = మనుష్యులు , విశేషేణ = విశేషముగా , అన్నమ్ = అన్నమును , దాతుమ్ = ఇచ్చుటకై ఇచ్ఛన్తి - ఇచ్ఛయించుచున్నారు ।

ఇంకనూత్తమపెండలగునవాటిని గురించి-
భార॥అను॥ అ ౬౩ ॥ శ్లో ౨౮ ॥

తృమానవాస్త్రశ్చ ధీరాశ్చ
ధర్మకాగృషు చోదితాః ।

మఙ్గళాచారసంపన్నాః
పురుషాస్స్వర్గగామినః॥

తపోవన్తః = ఓర్పుగలవారును, ధీరాః= ధీరులును, ధర్మకార్యేషు = ధర్మకార్యము లవిషయమై, ఉద్యతాః = ప్రయత్నించుచు న్నవారును, మఙ్గళాచారసంపన్నాశ్చ- శుభాచారసంపన్నులునగు, పురుషాః= పురుషులు, స్వర్గగామినః = స్వర్గమును పొందెడివారు, భవన్తి = అగుచున్నారు-

అపకారికి ఉపకారమును గుఱించి-
శివపురాణము- జ్ఞానసంహిత.

అపకారిషు యశ్చైవ
హ్యుపకారం కరోతివై।
తస్యదర్శనమాత్రేణ
పాతకం నైవ తిష్ఠతి॥

యః- ఎవ్వఁడు, అపకారిషు= అపకారుల విషయమై, ఉపకారమ్= ఉపకారమును,

కరోతి = చేయుచున్నాఁడో, తస్య = వా నియొక్క, దర్శనమాత్రేణ = దర్శన మాత్రముచేత, పాతకమ్ = పాపము, న తిష్ఠత్యేవ = ఉండదు.

భారతము - శాంతిపర్వము॥
అ ౨౭౮ ॥ శ్లో ౯॥

అభివాదాంస్తితిక్షేత
నాభిమన్యేత కించన ।
క్రోధ్యమానః ప్రియంబ్రూయా
దాకృష్టః కుశలంవదేత్ ।

అభివాదాన్ = అభిముఖులుగానాడు మాట లను, తితిక్షేత = సహించవలసినది-కించన = దేనినైనను, నాభిమన్యేత = అభిమానించగూడదు-క్రోధ్యమానః = కోపపెట్టబడ్డవాఁడై, ప్రియమ్ = ప్రియమయినదానిని, బ్రూయాత్ = పలుకవలయును- ఆకృష్టః = తిట్టబడ్డవాఁడ యి, కుశలమ్ = క్షేమమును, వదేత్ = పలుక

వలయును.

భగవంతుని యందే భారముంచవలసినది
అనుసంగతిఃగూర్చి
భగవద్గీ ॥ అ ౧౮ ॥ శ్లో ౬౬॥

సర్వధర్మాన్ పరిత్యజ్య
మామేకం శరణం వ్రజ।
అహంత్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి మాశుచః॥

సర్వధర్మాన్=అన్నిధర్మములను,పరిత్యజ్య=విడిచి, ఏకం= ఒకఁడనగు, మామ్= నన్ను,శరణమ్=శరణమునుగా, వ్రజ=పొందుము- అహమ్=నేను, త్వా= నిన్ను, సర్వపాపేభ్యః= అన్నిపాపములనుండి, మోక్షయిష్యామి= విడిపించెదను- మాశుచః= దుఃఖింపకుము-

సర్వధర్మ పరిత్యాగమును గూర్చి పూర్వాచార్యులయిన శ్రీశంకరాచార్యుల

వారున్ను శ్రీరామానుజాచార్యులవారున్ను శ్రీమధ్వాచార్యులవారున్ను భిన్నభిన్నతాత్పర్యములు పడివ్రాసియున్నారు-సర్వధర్మ పరిత్యాగమనఁగా భగవద్ధ్యానతత్పరుఁడగు పురుషుని స్వయముగా సర్వధర్మములనువిడుచుటకాని పురుషుఁడులోకోపకారార్థంబులగు సర్వధర్మంబుల విడుచుట యగునా? ఆమతకర్తలగు పైవారు కేవలము సంన్యాసులయి భగవంతునినే ధ్యానింపుచున్నను లోకోపకారము నిమిత్తము ప్రస్థానత్రయమునకు భాష్యములు చేసి దూరమైన దేశములకు కూడ కాళ్లనడకనే వెళ్లి జ్ఞానోపదేశములు చేసి మతస్థాపనములు చేయలేదా

మోక్షమునుగూర్చి-

భగవద్గీ|| అ౬|| శ్లో౪౫||

ప్రయత్నా ద్యతమానస్తు
యోగీ సంశుద్ధకిల్బిషః|

అనేకజన్మ సంసిద్ధః
తతోయాతి పరాంగతిమ్॥

ప్రయత్నాత్= పయత్నమువలన, యతమా
నః= యత్నము చేయుచున్న, యోగీతు=
యోగియైతే, సంశుద్ధకిల్బిషః= పోయిన మ
లినము గలవాడును అనగా పాపములేని
వాడును, అనేకజన్మసంసిద్ధః= అనేక జ
న్మములయందు సిద్ధిపొందినవాడునయి,త
తః= అటపయిని, పరాంగతిమ్= గొప్పగ
తిని, యాతి= పొందుచున్నాడు-

భగవద్గీ॥అ౧౩॥శ్లో౨౮॥

సమంపశ్యన్హిసర్వత్ర
సమవస్థిత మీశ్వరమ్।
నహినస్త్యాత్మనాత్మానం
తతోయాతి పరాంగతిమ్॥

సర్వత్ర= అంతటను, సమవస్థితమ్= సమ
ముగానున్న, ఈశ్వరమ్= ఈశ్వరుని, పశ్యన్

= చూచుచున్నవాఁడు, ఆత్మనా= ఆత్మ చేత, ఆత్మానమ్= ఆత్మను, ఒకమనిషి చేత ఒకమనిషిని, నహినస్తి హి= హింసింపఁడుగదా- తతః= దానివలన, పరామ్= గొప్పదియగు, గతిమ్= గతిని, యాతి= పొందుచున్నాడు-

భగవద్ధ్యానతత్పరులగు వారలమనస్సులు వేనిని అంటవుగదా-

భాగవతము సప్తమస్కంధము-

సీ॥ మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు।
నిర్మల మందాకినీ వీచికలఁ దూఁగు
రాయంచ చనునె తరంగిణులకు।
లలితరసాల పల్లవఖాదియై చొక్కు
కోయిల చేరునే కుటజములకు।
పూర్ణేందు చంద్రికాస్ఫురితచకోరక
మరుగునే సాంద్రనీహారములకు।

నంబుజోదరు దివ్యపాదారవింద।
చింతనామృత పానవిశేష మత్త।
చిత్తమేరీతి నితరులఁ జేరనేర్చు।
వినుత గుణశీల మాటలు వేయు నేల॥

మందార మకరందము= కల్పప్రసూన మకరంద ముపంటి భగవద్ధ్యానామృతము యొక్క; మాధుర్యమును- తెపివి, కోరిలు= త్రాగు చుండు, మధుపంబు= మనంబనెడి తుమ్మెద, మదనములకు= ఉన్మత్తపుష్పములవలె నసహ్యములగు నితరకార్యముల మీదికి, పోవునే= పోవునా- నిర్మలమందాకినీ= స్వచ్ఛమైన గంగానదవలె పవిత్రమైన భగవద్ధ్యానామృత ప్రవాహము యొక్క; వీచికలన్ = తరంగములయందు, తూగు= ఊగుచున్న; రాయంచ= రాజహంసవంటి మనస్సు, తరంగిణులకు= ఇతరనదులవంటియన్యకృత్యంబులమీదికి, చనునె= నడచునా- లలితరసాల

పల్లవ=సుందరములగుతియ్యమామిడి చిగుళ్లవ
లె మనోహరంబగుభగవద్ధ్యానామృతమును,
ఖాదిమై=అనుభవింపుచున్నదై, చొక్కు=సుఖ
పారవశ్యమును పొందియున్న, కోయిల=
కోయిలవంటి చేతము, కుటజములకు = అం
కుడుచిగుళ్లవలె వెగటయిన యితరకార్య
ములమీదికి, చేరునే= అనుసరించునా. పూ
ర్ణేందు చంద్రికా= పూర్ణచంద్రుని వె
న్నెలవలె నాహ్లాదకరంబగు భగవద్ధ్యా
నామృతమందు, స్ఫురిత= ప్రకాశించుచు
న్న, చకోరకంబు=చకోరమువంటిచిత్తము,
సాంద్రనీహారములకు= దట్టమైనమంచువలె
నున్న యితరకార్యములకు, అడుగునే= వె
ళ్లునా- అంబుజోదరు దివ్య పాదారవింద
చింతనామృతపానవిశేషమత్త చిత్తము= ప
ద్మనాభుని, పద్మమునాభియందుగల విష్ణు
వుయొక్క నాభిపద్మమందు సృష్టికర్తగా

నియమింపఁబడ్డ బిహ్వ ఉద్భవించినట్లు చె
ప్పుచున్నారుగనుక—కారణం కారణా
నామ్—అనిచెప్పఁబడిన భగవంతుని ది
వ్యంబులగు నడుగువాసురలయొక్క ధ్యా
నంబనెడి యమృతపానము చే మిగుల మ
దించిన చిత్తము, పరీతి= పచొప్పున, ఇత
రుల= పైవారలననఁగా నితరకృత్యముల
ను, చేరన్= పొందుటను, నేర్చు = నేర్చ
ను. వినుతగుణశీల = స్తోత్రము చేయఁద
గిన గుణములును స్వభావంబును గలవాఁ
డా, మాటలు వేయు నేల=పలుకులు వేయెం
దుకు-

అనఁగా భగవంతునియందు ధ్యాన
ము కలిగిన మనస్సు ఇతరధర్మములవల్ల త
నకు కార్యమున్నదనిఅనుకొనునా-

ఉత్పన్నమైనమతములు-

౧ (1) ఆదినిమిసర్ అనే దేశము

లో, అనఁగా ఐగుప్తు దేశములో, ఇప్పుడు ఇంగ్లీషువారు ఈజిప్టని వ్యవహరించుచున్న దేశములో, అప్పటి జనులు విశేషప్రాజ్ఞులయి తమకున్ను భగవంతునకున్ను ఉన్న సంబంధము ఆలోచిస్తూ లోకోపకారమయినపనులు చేయడమున్ను భగవంతుని ఆరాధననిమిత్తము అనేకవిధమయిన ఒక్కొక్క దేవతనుగురించి రూప నిరూపణ చేసుకొని పూజలేర్పఱచినట్లున్ను జీవులకు జన్మాంతరములున్నట్టును పరలోకమున్నట్లును నమ్మకముకలిగి యుండినట్లు చెప్పబడియున్నది.

x (2) మఱియును ఏష్యాఖండమునకు పశ్చిమపుదిక్కు ననున్న అసీరియా, (ఇంమలోనిదే) కాల్డియా, బాబిలోనియా దేశములలోనుకూడా మతవర్చను గుఱించిన్ని లోకోపకార కార్యముల యొక్క ని

బంధనలనుగురించిన్ని మతములు ఏర్పడి యుండినట్లు కనబడుచున్నది. అవియును రూపనిరూపణ చేసియె కొలుస్తూ ఉండిన ట్లున్ను పరలోకపునమ్మకము కలిగి యున్న ట్లున్ను కనఁబడుచున్నది.

౬ (3) గ్రీస్ దేశములో అప్పటి గ్రీకుల వల్ల మతవిచారణ ప్రజ్వరిల్లి జ్ఞానవిశిష్టమైనఆసక్తి ప్రబలమై భగవంతుని యారాధన అనేకరూపకములుగానున్ను అనేకవ్యక్తులుగానున్ను పర్పగ్చబడ్డది. మనుష్యునకు మనుష్యుఁడు చేయవలసినయుపకార ప్రయోజనములయిన పద్ధతులు కూడ ఏర్పడియుండెను. వీరి ఋషులు అద్భుతకార్యములను (miracles) చేసినారనిన్ని చెప్పబడియున్నది.

౭ (4) వారి తర్వాత పిబలులయిన రోమనులచేత కూడ ఇదే ప్రకారము భగ

పత్యూపజయోకరా విస్తీర్ణమును చేసి అనేక ప్రకారములయిన పూజలు రూపములుగా పర్పర్చబడ్డది. మనిషికి మనిషి చేయవలసిన ఉపకార పద్ధతులు పర్పడి యుండెను.

వీరికి అనఁగా గ్రీక్ రోమన్ మతస్థులకు పరలోక మున్నట్లున్ను భగవంతుని యారాధన యుండవలసినట్లున్ను ఆత్మనిత్యమైనట్లున్ను చెప్పబడియున్నది.

పైని చెప్పఁబడిన ఈజిప్టు కాల్డియా బాబిలోనియా దేశములు ఇప్పుడు మహమ్మదుమతము చే ఆక్రమింపఁబడినట్లు కనబడుచున్నవి.

గ్రీస్ రోమన్ దేశములు కిరస్తాన్ మతమువల్ల ఆవరింపబడ్డట్లు కనబడుచున్నది.

పరిస్తుతము పృథివిలో వర్తించుచున్న మతములు

౮ హిందూమతమును గుఱించి ఇదివ రకు చెప్పియేయున్నాను- ఇదిగాక (1) యెహూదీమతము (2) పారసీకమతము (3) బౌద్ధమతము (4) జైనమతము (5) కాన్ఫ్యూషిఅస్ అనే చీనామతము (6) కిరస్తాన్మతము (7) ఇస్లామ్ అనగా మహమ్మదయమతము ఇవిముఖ్యముగా ప్రవర్తించుచున్నవి- ఇంకను అనేకమతములు అనేకవిధములుగానున్నవి.

౯ (1) యెహూదీమతమనఁగా హిబ్రూభాషను ఓల్డుబైబిలులో చెప్పబడిన మతము భగవంతుఁడొక్కఁడే అనిన్ని అతఁడు అతిపవిత్రుఁడనిన్ని లోకుల హితముకొఱకు ఆయనపూజనిమిత్తము జరూద్లెమ్ పట్టణములో ఏర్పఱిచిన దేవాలయములో ఆర్కు అనే ముఖ్యస్థానముగా ఏర్పఱిచిన గోశపిదేశములో భగవంతుఁడావరిం

చి యుండెననిన్ని యజ్ఞాదిమూలముగా బ
లులు ఆదేవాలయములో అతనికివ్వడముకు
వాటిక్త లేర్పడినవనిన్ని అతడు ప్రజలకు వ
దిఆజ్ఞలు ఇచ్చినాఁడనిన్ని నీతిమార్గముగా
తిరగవలసినదనిన్ని ఒక్కఁతన్నేగాని భూ
ర్భువస్స్వర్లోకములలోనున్నవస్తువును కొలు
వగూడదని చెప్పి నాఁడనిన్ని చెప్పబడియున్న
ది- చాలానిర్దిష్టములకు ఆయన స్వయ
ము విజయము చేస్తూ ఉండేవారనిన్ని మెస
యా అనే ఒకపురుషుఁడు హిందువులలో
కలికావతారమెత్తునని చెప్పబడినట్లు అవతార
మెత్తి వచ్చి వారిని సంరక్షి స్తా
డనిన్ని వారిదీర్ఘదర్శులవల్ల చెప్పబడియున్నది.
ఈమతఋషులు అద్భుతకార్యములు(mira-
cles ) చేసినట్లు చెప్పబడియున్నది- ఈమత
ములో పర లోకమును గురించి స్పష్టముగా
చెప్పినట్లు కనబడదు- అయినా ధ్వనియుండ

వచ్చును.

౧౦(2) పారసీకమతము- భగవంతుఁడొక్కఁడే అనిన్ని అతనిపూజ ఆయన చేసినగొప్పకాంతిగల వస్తువును అనఁగా అగ్నిని ఆరాధించుటనిన్ని ఆదిముఖ్యమనిన్ని సదాచారముగా తిరుగవలసినదనిన్ని నీతివర్తనముగ ప్రవర్తించుచున్న యెడల మంచిలోకములకు లుగుననిన్ని చెప్పబడ్డది. కొన్ని ఆత్మలను నిత్యముగా భగవంతుడు ఉంచునని కొన్ని ఆత్మలను వారిపాపములుకొలది నశింపచేస్తాడనిన్ని చెప్పబడడమే కాకుండా హిందువులలో కలికావతారమెత్తేటట్లు చెప్పబడ్డట్టు భగవంతుఁడు అవతారమెత్తివచ్చి వారిని సంరక్షించుననిన్ని చెప్పబడియున్నది - ఈ ప్రకారము జ్యొరాష్టర్ అనే వారి మతగురువు వ్రాసినజందవస్థ అనే వారిముఖ్యమతగ్రంథములో చెప్పబడియు

న్నది

౧౧(౩) బౌద్ధమతము. సకలప్రాణులను తన ప్రాణమువలెచూచుకొనవలెననిన్ని అనుకంపాగుణము మనుష్యులయందేకాక తిర్యగ్జంతువులయందును తుదకు పురుగులయందును గూడ కనుపర్చవలెననిన్ని ఇటువంటి ధర్మాచరణమె మనుష్యులకు విధిఅనిన్ని చెప్పబడినదిగాని దైవమున్నట్లు చెప్పలేదు -

అయితే పైజన్మములు పైలోకములు ఉన్నవనిన్ని వ్రతమాచరించెడి అనఁగా ధర్మచక్రప్రకారముఆచరించెడిపురుషు లకును స్త్రీలకును ముక్తి అనఁగా నిర్వాణముఅనఁగా ఏమీలేకపోవుట కలుగుతుందని చెప్పబడియున్నది- ఈమతము శాఖలుగా ఏర్పడియున్నట్లు కనబడుతున్నది -

బౌద్ధమతమునకు బుద్ధుఁడు ప్రధా

నుడనిన్ని జైనమతమునకు జినుఁడు ప్రధా నుఁడనిన్ని చెప్పఁబడియున్నది- బౌద్ధుల ఋషులున్ను జైనుల అర్హంతులున్ను చా ల అద్భుతకార్యములు (miracles) చేసిన ట్లు కనఁబడుచున్నది-

౧౨ (4) కాన్ ఫ్యూషి అస్ అనే చీనాగురుమతము- ఈమతములో పైని చెప్పిన వరుసనే సమస్తప్రాణులయందును అనూ కంపాగుణము కనుపరచవలసినదనిన్ని హెవిన్ అనఁగా పైస్థానమును ఆరాధించుమని న్ని చెప్పఁబడియున్నదిగాని పరసనల్ గాడ్ అనఁగా భగవంతుఁడనే పరమాత్మనుగు రించి చెప్పఁబడి యుండలేదు- పితరులనగు రించి ప్రిధానములు మాత్రము చెప్పబడి యున్నవి-

చీనాదేశపు చక్రవర్తిగారు ఈమత ప్రవర్తకాధ్యక్షులుగానుండి పైస్థానము

అనఁగా హెవిన్ కు కుమారుఁడుగా పైస్థానమును పూజ చేస్తూఉంటారు-

౧౩(5)జపానుదేశస్థులు చీనాదేశస్థులకంటె తక్కువమతప్రవీణులుగా కనుబడుదురు- లేవోట్జు (Lao-tze) అన్న గురువు వీరిమతగురువు- ఈయనకున్ను కాన్ఫ్యూషియసు ( confucius )అనువారికిన్ని సంభాషణలుజరిగినట్లు కనఁబడుచున్నది- చాలామంది ప్రజలు షిన్ టో యిస్ (shin- tois) అనిన్ని బౌద్ధులు అనిన్ని వాడుకచేయబడుచున్నారు- షింటోయి అనే శబ్దమునకు అర్థము దేవతలకు యుక్తులకు మార్గము అని- చేతనవస్తువులకే కాకుండా అచేతనవస్తువులకుకూడా ఆత్మయున్నదని వీరిమతము- వాయువుమొదలయిన అనేకదేవతల ఆరాధనముకూడా వీరిమతములో కలిగియున్నది.

౧౮-(6) క్రైస్తవమతము. లోకోద్ధారణ నిమిత్తము భగవంతుఁడు యెహూదీ దేశములో పూర్వము వారిదీర్ఘదర్శులు చెప్పిన మెసయా క్రీస్తు (అభిషిక్తుఁడు) అనే మనిషిగా అవతారమెత్తినాఁడనియును, అనేకోపదేశములు, పరోపకారవిషయమైయును క్షమయనగా ఓర్మినిగురించియును అపకారికి ఉపకారము చేయుమనియును మనిషి ఎప్పుడును నిర్లిప్తతగా ఉండవలసినదనియును మనుష్యులు ఒకరికొకరు సోదరభావముగానుండి భగవంతునిమహిమను కొనియాడుచుండవలయుననియును రేపటిసంగతికి జిజ్ఞాస చేయనక్కరలేకుండ మొట్టమొదట భగవంతునిరాజ్యమును అనఁగా ఆయనయొక్క స్థానప్రాప్తిని కోరుమనియును ఐహికములు వాటియంతటను అవియె సంప్రాప్తములగు

ను అనియును చెప్పబడి యున్నది-

ఈయన చాల అద్భుతకార్యములు జరిగించినాడని న్యూటెస్టమెంటులో చెప్ప బడినది-

అప్పటి జోద్ అనగా యెహూదీమ తమువారు ఓల్డుబైబిలుకు అపార్థము చేసి జరిగించిన కొన్ని భేషజకార్యములు నిరర్థకముల నివారించెడి యుపదేశములు చేసినాడనియును, ఈయనమిసయా అనేడి రక్షణ నిమిత్తము రాబోయే అవతారపు కృత్యమును వహించినాఁడనియును అప్పటి ఆదేశవాసస్థులయిన యెహూదీయులు ఈయన మీద అప్పటి రాజ్యమేలుచున్న రోమన్ వారి న్యాయాధిపతియైన పైలెట్ దగ్గఱ మొఱ్ఱబెట్టుకొని ఆయనను సిలువకు కొట్టించినారనియును, తీర సిలువకు కొట్టేసమయములోఁగూడ తన్ను ఈచొప్పున కొ

ట్టించినవారు ఎఱుగక ఈకృత్యముచేసినారు గనుక వారిని క్షమించవలసినదని భగవంతుని ప్రార్థన చేసినాఁడనియును, మనుష్యునిపాపములకై పూర్వము ఓల్డుబైబిలులో చెప్పఁబడిన యజ్ఞాదిబలులకు బదులుగా దేవుఁడయినప్పటికిని ఆయనయె బలియైనాడనియును, దయాధారేయుఁడైయున్నవాడనియును, మరణమును బొంది తిరిగి లేచివచ్చి భూలోకములో నివసించి తనశిష్యులకు కనబడి తనదైవత్వమును స్థాపించి తరువాత ఆకాశమార్గముగా తన తండ్రియయిన భగవంతునితో ఏకత్వమును పొందిన తాను ఆయనస్థానమునకు వెళ్లిపోయి ఆయన కుడిభాగమందు ఉంటున్నాఁడనియును కిరస్తాన్ మతమును మూలగ్రంథమైన న్యూటెస్టుమెంటులో చెప్పబడియున్నది-

మఱియును ఈమతమును అనేక శాఖ
లుగా కిరస్తానులు ఆచరించుచున్నారు.
వారు అందఱును తండ్రియైన దే
వుడనియును కొడుకయిన దేవుఁడనియు
ను పరిశుద్ధాత్మ అయిన దేవుఁడనియును
ముగ్గురును ఒక్కడేయనియును త్రైత్మ
కత్వము ఏకాత్మకత్వముగా క్రైస్తువుయొ
క్క దేవత్వమును స్థాపించుచున్నారు.
ఇదిగాక ఇంకనొక కిరస్తాన్ శాఖ
వారు త్రైత్మకత్వమును ఒప్పకభగవంతుఁ
డు వేఱె ఒకఁడు ఏకాత్మకత్వముగా ను
న్నాఁడనియును మనుష్యునియొక్క రక్ష
ణార్థము ఈక్రీస్తువారిని ఆయన పంపి పు
రుష కారుణిగా చేసినాడనియును ఈయన
ద్వారమునానే ముక్తి కలుగవలెనంయును చె
ప్పుదురు-కాని ఈయనను మనుష్యులకందఱకు
రక్షకునిగా నెంచుచు ఈయనయొక్క దైవత్వ

మును ఒప్పరు. కాని న్యూటెస్టమెంటులో చెప్పబడ్డ ఈయన చేసినాడనిన అద్భుతకార్యములను చనిపోయి తిరిగివచ్చినాడనుటనను దేవునియొక్క కుడిభాగమందు పైన ఉంటాడనుటనున్న ఒప్పుకొనుచున్నారు.

ఇంక మృతిబొందిన క్రైస్తవులందఱును ఒకరికొకరికి స్వశరీరములతో బంధుబాంధవ మిత్రవీక్షణయును సాంగత్యమును భగవంతుని యెదుట కలుగుచున్నదని కూడ నమ్మకము కలిగియున్నది.

దీనినిబట్టి వారు తమవారు చనిపోవునప్పుడు, చనిపోయిన తరువాత తిరిగివారిని చూస్తారని మనోధైర్యముకలిగి మృతిబొందే భయమును నివారణచేసికొనుచున్నారు

౧౭ (7) ఇస్మాహీల్ మతము అనగా మహామ్మదీయ మతము - భగవంతుడొక్కడున్నాడనియును ఆయన నిరాకారనిరంజను

డనియును ఆయనయొక్క ముఖ్యమయినటు
వంటిన్ని కడపటివాఁడయినటువంటిన్ని దీర్ఘ
దర్శి మహాత్మ్యనియును ఉత్కృష్ట దర్శులయి
నవీల్లు బైబిలులో చెప్పఁబడిన అబ్రహామ్మో
దుదు మొదలయినవారును న్యాబయిబిలులో
చెప్పబడిన క్రీస్తువారును ప్రజలయుపకార
ము నిమిత్తము భగవంతునివల్ల పంపింపబ
డ్డ ఈశ్వరాజ్ఞానిహులయిన దూతలు అ
యియుండిరనియును అందులో కడపటిదీర్ఘ
దర్శియగు మహాత్మ్యముద్వారా లోకోప
కారార్థమైన అనేక ఆజ్ఞలు భగవం
తుడు ఇచ్చినాడనియును భగవంతుని ద
ర్శనమునకు ఆయన వెళ్లితిరిగి వచ్చెనుం
డెటివాఁడనియును భగవంతుని కొలవవ
లసినదనియును మనుష్యులు పరస్పరోప
కారములు చేసికొనవలసినదనియును ప్ర
తిబొందినతరువాత ఆత్మలు మోక్షమునఁ

గా పైని అనేక స్వర్గాదిభోగములు అను
భవించుచు భగవంతుని దర్శనము నప్పు
డప్పుడు చేయుచుమహాత్ముడుయొక్క సాం
గత్యము కలిగి ఆయన ఆదరణను కూడ
పొందియుందురనియును మోక్షమనునదిభ
గవంతునియొక్క కారుణ్యమువల్లనే కలు
గవలసియుండును అనియున్నదిగాని మఱి
యేకర్మములవల్లను కాదనియును చెప్పబడి
యున్నది-

౧౬ మొదట హిందూమతమును గురించి
చెప్పియున్నప్రకారము భరతఖండములో
అనేకమతములు ప్రసరించి కొందఱు అన్య
మతావలంబులయినప్పటికిని ఈ దేశము
మెట్టుమీద హిందూమతమునే అవలంబిం
చియున్నదిగానిఅన్యమతాక్రాంతము కాలే
దు- పృథివిలో ఇతరదేశములు ప్రాయశః
అన్య మతాక్రాంతములయినటులకనబడుచు

న్నవి-

ఏష్యాఖండములో హీబ్రూభాష
లో చెప్పబడిన ఓల్డుబయిబిలులో నుదా
హరించబడ్డ యెహోవాదీవ్యత్తస్థులు ఇప్పుడు
పృథివిలో నచ్చటచ్చట వ్యాపించియు
న్నారు- పూర్వము వారి దేశమైన జూడి
యా ఇప్పుడు మహమ్మదుమతము చేతను
న్ను కిరస్తాన్ మతము చేతనున్ను ఆక్రాం
తమైనటుల కనబడుచున్నది-

మఱియును పూర్వము పారసీకమ
తము వ్యాపించియుండిన పారసీకదేశము
ఇప్పుడు మహమ్మదు మతముచే నాక్రాం
తమైయున్నది - పారసీకమతస్థులు చా
లమంది ఇండియా మొదలయిన దేశములలో
వ్యాపించియున్నారు-

మఱియును జపాన్ చీనా బర్మా
సింహళద్వీపము మొదలయిన దేశములును

వారి పూర్వపుమతమును విడిచి ఇప్పుడు బౌద్ధమతమువల్లనున్ను అంకుల తత్త్వము గల మతములవల్లనున్ను ఆక్రాంతములయి యున్నవి.

యూరపుఖండము పూర్వము గ్రీకు రోమను మతములచేతనున్ను వారివారి స్వమతములచేతనున్ను వ్యాపింపబడియుండినది. ఇప్పుడు కిరస్తాన్మతమువల్ల ఆక్రాంతమయి యున్నది. అయితే ఈఖండములో కొద్దిప్రదేశమైన తురికీరాజ్యము మాత్రము మహమ్మదుమతముచే నాక్రాంతమయియున్నది.

ఆఫ్రికా ఖండములో చాల ప్రదేశములున్ను కొన్నిద్వీపములున్ను పశ్చాత్యఖండములో కొన్ని ద్వీపములున్ను పూర్వమతములనువిడిచి ఇప్పుడుమహమ్మదుమతముచే ఆక్రాంతమైయున్నవి.

ఉత్తరదక్షిణ అమెరికాఖండములు
న్ను ఆస్ట్రేలియాఖండమున్ను పూర్వ
పు మతస్థులు ఎచ్చటనైనను కిరాతకులు
గా నున్నప్పటికిని ఇప్పుడు యూరపు ప్రజ
లవల్లనే నింపబడి క్రిస్తుమతమువల్ల ఆక్రాం
తములయి యున్నవి-

౧౭- లోకములో మతము జనసంఖ్య-
హిందువులు ౧౩౯౨౮౮౬౫౨౬- మెహమ్మ
డీలు ౯౩౧౨౬౦- పారసీకులు ౧౦౦౭౧౯౦
బౌద్ధమతములో చీనా జపాను దేశములుక
లుపుకొని ౮౬౩౧౫౪౭౫- క్రైస్తవులు ౩౭౦
౬౭౬౨౨౨- మహమ్మదీయులు ౧౦౩౮౫౩
౫౯౮- ఆఫ్రికా దేశములోనున్న ఇతరఖం
డములలోనున్న అజ్ఞానముగానుండే ప్రజ
లుఒకొక్క దేవతను నిరూపించుకొని ఒ
కొక్క కార్యసిద్ధికొఱకు అర్చనచేసికొ
నిపోలిచేమతస్థులు ౧౬౯౨౦౦౦౦౦- కొఱకు

వెరసి అన్యమతముల జనులు ౧,౨౯౪,౩
౩౯,౬౩ మందిగా గ్రంథమువల్ల కనబడు
చున్నారు.

౧౫ మతములన్నియును ఇంచుమిం
చుగా భగవంతుని ఆరాధనను గురించి
యును యాత్ర ప్రవర్తనగాతిరుగలంబులకును
చెప్పుచున్నవిగదా- ఇదిగాక కిరాతకుఁడుస
హా భగవంతుఁడున్నాఁడన్న జ్ఞానమున్న
లోకమునకు ఉపకారము చేసి జ్ఞానము
న్ను కలిగియున్నట్లు కనబడుచున్నది- అం
దు వల్లఏమి తెలియఁబడుచున్నది?- ఇహలో
కసౌఖ్యమున్ను పరలోక సంప్రాప్తిన్ని క
లుగుచున్నదిఅనిగదా- అయితేమనుష్యున
కు తనబుద్ధిసంకర్షణ అనఁగా విచారణ
యొక్క న్యూనాధికములవల్ల జ్ఞానాధిక
మున్ను జ్ఞానన్యూనత్వమున్ను కలిగినట్లుమన
ముఒప్పుకొనవలసినది గదా- అందువల్లజ్ఞా

నాధికులయినవారు భగవంతునియొక్క జ్ఞానమును ఎక్కువగా తెలిసికొందురు- జ్ఞానమ్యానత్వము కలిగినవారు భగవంతుని ఆరాధన వేఱువిధముగా తెలిసికొందురు-

౧౯ భగవంతుఁడు మనహృదయమందె వివేచనాశక్తి కలుగఁజేసి యుక్తప్రవర్తనగా తిరుగులందులకున్న తన్ను ఆరాధించుటకున్నా అతఁడే మనశ్శక్తి కలుగజేసినట్లు కనఁబడుచున్నది.

౨౦ పరమపురుషుఁడొక్కఁడెరా॥
పరిక్షింప నందఱికిని॥

౨౧ ఈరోజు మనము ఆశతో నిరీక్షించుచున్నట్టి గొప్పపండుగదినము- ఈదుర్ముఖ సంవత్సరాదియందు అనేకమంది సుహృదులును బంధువులును దేవుని యెదుట మన మనసులలోనున్న ఆశలన్నియును తెలుపుటకు కూడుకున్నట్టి సమయము- అతిపరిశు

ధ్యుడైన దేవునియొక్క ప్రకాశమైన సింహాసనము వద్దకు వెళ్లుచున్నట్టిమన ప్రార్థనయొక్క ధ్వనిని అతఁడు వినకుండా ఉంటాడా?-

సంవత్సరము సంవత్సరముజరిగే ఈ యుత్సవములు అనఁగా భగవంతుని గూర్చిన సంతోషకరమైన ధ్వనియును మీఅందరితోకూడనేను చేయడము సంప్రాప్తమైనదిగదా-

వాయు పూరితమైన హద్దులేని ఆకాశములోకోటకోటినక్షత్రములను మనము నివసించియున్న భూగోళమును ప్రభావయుక్తమైన సూర్యునిని చంద్రునిని సృజించి నిలిపి వారిపనులు క్రమముగా నడిపించుచున్న

శ్రు॥ భీషాస్మాద్వాతఃపవతే।
భీషోదేతి సూర్యః

శ్రీకృష్ణ పరమాత్ముఁడయిన విశ్వకమనీయమో
కర స్మరణమియుందజిశోకహాడి చేయుఁడ
మాకన్న నా భాగ్యమేమున్నది

సంపూర్ణము.

